Registered No. M-4484

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ జూలై నెల 17 వ తేది శుక్రవారం [నె. 28 రు.

## యుద్ధ విమర్శ.

### ఫ్రాంసు స్వాతంత్ర్యోత్సవం—జర్మనీపై విమానదాడి.

రాయలు విమాన దాడులు.

ఈ వారంలో రాయలు విమానాలు శత్రు రాజ్యంపై తీవ్రమగు దాడులు జరిపి వారి కర్మాగారాలకు, పరిశ్రమ కేంద్రాలకు చాల నష్టం కలిగించేయి. 11 వ తేదీ సాయంకాలం పెక్కు బాంబరు విమానాలు డాంజిగుపైకి, మరి కొన్ని ఫ్లెన్సుబర్గుపైకి పోయి బాంబులువేసి ఆ రెండు చోట్లను ఉన్న జర్మను జలాంతర్గామి కర్మాగారాలకు చాలనష్టం కలిగించేయి. మరికొన్ని విమానాలు శత్రుదేశపు సముద్ర తీరాన్న నీటిలో మందుగనులువేసి నౌకా మార్గాలు నిరోధించివచ్చేయి. డాంజిగు ఇంగ్లాండు తీరానికి 800 దూరంలో పోలండు ఉత్తరకొన నున్న రేవుస్థలం. ఇంతదూరం పట్టపగలే వెళ్లి యుద్ధం జరపడం యిదే మొదటిసారి. ఫ్లెన్సు బర్గు ఇందులో సగందూరంలో నుంది.

13 వ తేదీ సాయంకాలం రాయలు విమానాలు జర్మను రేవు పట్నమగు ఓస్టెండుపై దాడి జరిపి, మూడు స్టీమరులను కాల్చివేసినవి. ఈ దాడినుండి ఒక్క విమానం తిరిగి రాలేదు. 15 వ తేదీన ఉత్తర ఫ్రాంసులో విమానాశ్రయములపై బ్రిటిషు విమానాలు దాడిచేసి, మరఫిరంగులు ప్రేల్చి చాల నాశనం కలిగించినవి. మూడు జర్మను ఫైటరు విమానాలు నాశనమయినవి.

పడమటి జర్మనీలో డీసుబర్గు అను ముఖ్య పరిశ్రామిక కేంద్రంపై 13 వ తేది రాత్రి రాయలు విమానాలు దాడి చేసి చాల నష్టం కలుగ జేసినవి. మంగళవారం రాత్రి రూరు ప్రాంతములందు బాంబులువేసి పెక్కు మంటలు కల్గించినవి.

## మదరాసు రెజిమెంటు, దివ్యమయిన పని.

లిబియాలో బిరు ఎల్ హకీమునందు యుద్ధంచేసిన ఇండియను శతఘ్నిదళము కమాండరువద్దనుండి రూఢియగు సమాచారము వచ్చినది. ఈ దళమునందు మదరాసు బాటరీ జట్టుగలదు. వీరుచేసిన ఘన కార్యములు యీ సందేశమునందు అమితంగా ప్రశంసింపబడినవి. ఆతడిట్లు వ్రాసెను: "వారు (మదరాసు బాటరీ) చాల దివ్యముగ పనిచేసిరి. వారిని ఎంతని పొగడిన తనివి తీరదు. ఉద్యోగులు సిపాయిలుకూడ అసమాన్యముగ పని చేసిరి. జర్మను పాంజారు (టాంకు) డివిజను, ఇటలీ డివిజను వారి నెదుర్కొనెను. వారు అధిక సంఖ్యాకులగు శత్రువులచే ఓడింపబడు లోపున కనీసం 56 టాంకులనైన కూల్చియుందురు. ఒక అంగుళమయిన కదలక, అధిక సంఖ్యాకులగు శత్రువులు వచ్చి పడువరకు, త్రోవకడ్డంగా ఖైటాయించిరి. మేము తిరిగి సైన్యాన్ని త్వరగ కూడదీసుకొనుచున్నాము. తిరిగి అచ్చోటికి పోవుటకు ఆదుర్దపడుచున్నాము. ఈ రెజిమెంటును అభినందించుచు కర్నలు తంతి వార్త పంపెను; చర్చిలు ప్రధాని ప్రశంసించుచు వాయువార్త పంపెను."

ఫ్రాంసులో విప్లవంజరిగి ప్రజా ప్రతినిధి ప్రభుత్వం స్థాపించిన వార్షికదినం జూలై 14 వ తేదీ. 1871 వ సం॥ యీ తేదీవరకు ఫ్రాంసు నిరంకుశ పాలకులగు రాజులచే పాలించబడు చుండగ ప్రజలు తిరుగబడి, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం అను యీ మూడు ఆదర్శములతో యుద్ధంచేసి, రాజును తొలగించి రిపబ్లికు స్థాపించిరి. ఆ సుదినంయొక్క వార్షికోత్సవం నాడు ఫ్రాంసు ప్రజల నుద్దేశించి స్వతంత్ర ఫ్రాంసు నాయకుడగు డిగాల్‌గారును, అమెరికా అధ్యక్షుడగు రూజువెల్టుగారును, ఇంగ్లాండు విదేశాంగ మంత్రియగు ఈడెనుగారును సందేశములను పంపిరి.

ఫ్రాంసు స్వాతంత్ర్యోత్సవం.

ఈ మంగళవారమునాడు ఫ్రాంసు స్వాతంత్ర వార్షికోత్సవం లండనులో ఫ్రెంచి విక్టరీస్మారక చిహ్నమువద్ద జరిగినపుడు స్వతంత్ర ఫ్రెంచి సేనానాయకుడగు జనరలు డిగాలుగారు హాజరయి యుండిరి. సుమారు 20,000 మంది ఫ్రెంచివారు ఉత్సవమునందు పాల్గొనిరి.

ఇంగ్లాండు విదేశాంగ మంత్రి ఆంతోని ఈడెనుగారు, యీ సందర్భమున ఫ్రెంచి ప్రజలను "మిత్రులుగా" సంబోధించుచు పంపిన సందేశముగల కరపత్రములు 50 లక్షలు విమానముల ద్వారా ఫ్రాంసులో వెదజల్లబడెను. ఒక శతాబ్దంలో మూడు సారులు దాడిజరిపి ఫ్రాంసుపై అగ్ని కురిపించిన జర్మనీని యిపుడు ఫ్రాంసు ప్రజలు మిత్రదేశంగా విశ్వసింప జాలరనియు, జర్మనీకి కావలసిన సైనిక సహాయంచేసి యూరోపంతా జర్మనీవశం చేయడం వారి కిష్టంలేదనియు, ఫ్రెంచి రాజ్యంపై బ్రిటనుకి ఆశగలదను మాట వారు నమ్మరనియు, ఈడెనుగారు తెలిపిరి. "ఫ్రాంసు దేశంపై మాకు ఆశలేదు, ఫ్రాంసును తిరిగి మహాశక్తి వంతమగు దేశంగా పునరుద్ధరించడం యుద్ధాశయములలో నొకటగుటయేగాక, మన సమిష్టి నాగరికతా సాంప్రదాయమునకు అనుగుణ్యంగా యుద్ధానంతరం పునరుద్ధరణ కార్యమునకుగూడ అత్యవసరం." ఫ్రాంసు ప్రస్తుత నీచస్థితినుండి విముక్తి యగునను ఆశ వెలిబుచ్చుచు, "ఆ విముక్తి దినమునాడు మేమును ఫ్రాంసు ప్రజలును చేదోడు వాదోడుగ నుండగలము" అని ఈడెనుగారు తెలిపిరి.

అమెరికా అధ్యక్షుడగు రూజువెల్టుగారు "ఫ్రాంసు ప్రజలు త్వరలో తిరిగి స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం పొందగలరని ఆశించుచున్నా" ననిరి.

డిగాలుగారు ఫ్రెంచి ప్రజల నుద్దేశించి ఫ్రాంసు ప్రజలకు రేడియో ఉపన్యాసమునందు యిట్లు దెలిపిరి :—"శత్రువుచే ఆక్రమింపబడని ఫ్రాంసు దేశంలో ప్రతి గ్రామంలో యీనాడు ఎగురు త్రివర్ణపతాకము, ఉత్సవములును ఫ్రాంసు యింకను జీవించియున్నదనియు, శత్రు వాక్రమించి హింసలపాలు చేయుచున్న కష్టాలకు ఫ్రాంసు లొంగిపోలేదనియు, రుజువుచేయగలవు. ఫ్రాంసు తయారగుచున్నదని యిది రుజువుచేయగలదు. జర్మనీ వెనుకాడి, మిత్రమండలి సేనలు మన నేల నిలచి, ద్రోహులను మూలకు తరిమివేసి, ఫ్రాంసు జాతియంతా తిరిగి కోలుకొని కోపోద్రేకంతో శత్రువును శిక్షించుటకు రహస్యంగా శక్తికూడదీసుకొనుచున్నదని యీ ఉత్సవం రుజువు చేయగలదు."

---

# మూడవ ఇండియా యుద్ధ ఋణము.

## ఇండియా ప్రభుత్వపు ఖజానా సభ్యుని విజ్ఞప్తి.

1942 వ సం॥ జూలై 7 వ తేదీని "మూడవ ఇండియా యుద్ధ ఋణము" అను విషయమై ఢిల్లీ రేడియోద్వారా ఇండియా ప్రభుత్వపు ఖజానా సభ్యుడగు గౌ॥ సర్ జెరిమీ రెయిస్మనుగా రిట్లు చెప్పిరి :—

మూడవ యిండియా యుద్ధ ఋణపత్రములు కావలసినవారు ఎంతెంత మొత్తములకు పత్రములు కావలెనో రేపటినుండియు దరఖాస్తులు పంపుకోవలెను. ఈ సందర్భములో ఇండియా గవర్నమెంటువారి ఆర్థిక పరిస్థితులనుగూర్చి కొంచెం వివరించి చెప్పవలసియున్నది. యుద్ధ సమయములో ఏదేశపు ప్రభుత్వమైనను ద్రవ్యమునకై కొంత చిక్కుపడక తప్పదు, కాని, యీదేశపు ప్రభుత్వము యీ ఆర్థికావసరములను

సరిపుచ్చుకోగల్గెను. యుద్ధపు ఖర్చుల తాకుడు ఎంత తగిలినప్పటికిన్నీ, యీదేశ ప్రభుత్వము యుద్ధ వ్యయమును సంబాళించుకోగల్గినట్లుగా ఏ యితర దేశమైనను సంబాళించుకొనియుండలేదు.

ఇండియా గవర్నమెంటువారు ఇంగ్లాండులో అచటి పౌనులు షిల్లింగుల ద్రవ్యమానంలో చేసి యుండిన విదేశీ ఋణమునంతను తీర్చివేయగల్గి నది. ఇందువల్ల భారతదేశ ప్రభుత్వపు ఆర్థిక పరిస్థితి మరింత కుదురుగానున్నదని చెప్పవచ్చును. కాబట్టి యిప్పుడు ప్రారంభింపబడు యుద్ధ ఋణ పత్రములలో ద్రవ్యమును వినియోగించడం చాలా మంచి దివ్యమైన పెట్టుబడియని నేను నొక్కి వక్కాణించుచున్నాను. ఈ విషయము ఆర్థిక వ్యవహారాలు తెలిసినవారి కందరికీ విశదమైన విషయమే. కాని సామాన్య జనుల కందరికీ బోధపడునట్లుగా నేనొక విషయమును చెప్పవలసి యున్నాను.

యుద్ధావసరములకై యీ దేశములోని వస్తు సామగ్రులు విశేషముగా పంపబడుచున్నవి. అందువల్ల సామాన్య జనులకు ఆయా వస్తు సామగ్రులు గిరాకి అగుచున్నవి. కనుక యిటు వంటి సమయంలో ద్రవ్యవంతుడైన వివేకము గల వ్యాపారస్థు డేమిచేయవలెను? బజారులో ఉన్నటువంటి కొలదిసరకునే ఎక్కువ ధర యిచ్చి కొని నిల్వచేసి వ్యాపారము చేయరాదు. అందు వల్ల ఉన్న సరకుల ధర మరింత ఎక్కువగును. కనుక వివేకవంతుడైనవాడు తాను మితముగా ఖర్చుచేసికొని, స్వల్పవ్యయముతో నిరాడంబర జీవితమును గడుపవలెను. తన ద్రవ్యము నిప్పుడు జాగ్రత్తగా నిల్వచేసికోవాలి. ముమ్ముందు ధరలు తగ్గిపోగల కాలము రాగలదు. అప్పటికి యిప్పుడు నిల్వచేసిన ద్రవ్యము ఎక్కువగా అక్కరకు రాగలదు. కాబట్టి నేడు చేయదలచిన ఖర్చును రేపు చేయవచ్చునని వీలైనంత వరకు నిలిపియుంచుట శ్రేయస్కరము.

ఈవిధంగా తాను నిల్వచేసికొను ద్రవ్యమును తనదేశ రక్షణనిమిత్తమై యీసమయంలో గవర్నమెంటుకు అప్పుయిచ్చి గవర్నమెంటు యుద్ధ ఋణపత్రములలో వినియోగించవలెను. దేశము శత్రుభయమునుండి రక్షింపబడుటవల్లనే ప్రతి వానియొక్క ఆస్తియును భద్రముగా నుండ గలదు. ఈవిధంగా ప్రతి పౌరునియొక్క క్షేమ లాభములు దేశముయొక్క సమష్టి క్షేమ లాభ ములపై ఆధారపడియున్నవి. కాబట్టి దేశమును ఉపద్రవమునుండి రక్షింపవలసియున్నది.

యుద్ధము జయప్రదముగా సాగవలెనంటే, ద్రవ్యం చాలా ముఖ్యాధారము. శత్రువుతో రణ రంగమున ప్రతివాడును ఎదిరించి పోరాడజాలడు. కాని, యుద్ధరంగంలో పోరాడుచున్న మన యోధుల సహాయార్థం మనలోని ప్రతివారును యథాశక్తిగా తోడ్పడుటకు అవకాశము కలదు. మనకు చిట్టచివరకు విజయము తప్పక లభించ గలదు. అట్టి గట్టి నమ్మకము మనకు ఉన్నంత మాత్రమున ప్రయోజనంలేదు. మానవకోటి యొక్క భవిష్యత్స్వాతంత్ర్య నిర్మాణమునకై మన బిడ్డలు సుఖముగా జీవింపగల్గుటకొరకై మనము యుద్ధములో విజయమును సాధింప వలెను. అట్టి విజయమును సాధించుటకు యీ యుద్ధ ఋణమునకు ద్రవ్యమును సమకూర్చ వలెను.

---

# భారతీయ సైన్యం.

## పదరోసువారు అత్యధికంగాచేరుట.

భారతీయ సైన్యంలో ప్రతి నెల క్రొత్తవారు చేరుచున్నారు. మే మాసంలో యిట్లుచేరే క్రొత్తవారి సంఖ్య అత్యధికంగా పెరిగిపోయింది. అన్ని రకాల సైన్యంలోను సైనికులు నేర్పరులగు పనివారు 70,000 మందికి కొద్దిగ తక్కువగ చేరిరి. అంతకముందు అత్యధిక సంఖ్య డిశం బరులో 60,000 ఉండెను. అపుడు జపాను యుద్ధంలో క్రొత్తగ చేరియుండెను. అటు తరువాత సగటున నెలకు 50,000 మంది చేరు చుండిరి. గత యుద్ధంలో, నాను కొంబటెంట్సు (కుదురున యుద్ధ రంగంలో ప్రవేశింప నవసరం లేనివారు) మినహా క్రొత్త సైనికులు నెలకు 40,000 చొప్పున చేర్చుకొనబడిరి.

ఈ చేరినవారిలో నూటికి సగంమంది అది వరకు సైన్యంలో ప్రాతినిధ్యంలేని తరగతుల వారే. 1939 వ సం॥ సైన్యంలో లేని తెగల

వారుగూడ యిపుడు చేరిరి. అత్యధికభాగం క్రొత్త సైనికులు చన్నరాష్ట్రంనుండి వచ్చిరి. నిజానికి యీ రాష్ట్రంనుండివచ్చిన క్రొత్తవారి నందరిని చేర్చుకోడానికి అవకాశం లేనంత అధికంగావచ్చిరి. వారి రణోత్సాహం దివ్యంగా నుంది అని అధికారులు ప్రకటించిరి. క్రొత్త తరగతుల వారినందరిని చేర్చుకొనుటకు పూర్వము, ప్రస్తుత సైన్యంలోని తరగతి విభజన విధానం యించుక మార్చవలసియున్నదని తెలుపబడుచున్నది.

మదరాసు జట్లకు తగినంతమంది జూనియరు నాయకులను శిక్షణ యొసంగి తయారుచేయవలసి యుంది. ఈ నాయకులను తయారుచేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. వైస్రాయి కమిషను ఉద్యోగులకు, నాన్‌కమిషన్డు ఉద్యోగులకు రెండు శిక్షణ శిబిరాలు పెద్దవి పనిచేయుచున్నవి. మూచోది మదరాసీలకొరకు ప్రత్యేకంగా యేర్పాటు చేయబడుచున్నది. ఈ వారంటు ఉద్యోగులను తగినహోదాకు తయారుచేయుట సంతృప్తికరంగా జరిగిన పిమ్మట, మదరాసు రిక్రూట్సు (క్రొత్త ఉద్యోగులను) చేర్చుకొనుట యింకను వడిగ జరుగగలదు.

మొదట ప్రాత తెగలవారినుండే క్రొత్త సైనికులను చేర్చి సైన్యాన్ని పెంచియుండిరి. అట్టి వారిలో జబ్బుపడినవారికి, యుద్ధరంగంలో హాని చెందినవారికి, బదిలీగా తగినంత రిజర్వు శిబ్బంది నుంచుటకుగూడ అధికారులు తగు యేర్పాటులు చేసిరి. యుద్ధానికి పూర్వం రిజర్వు సైన్యం యీ ప్రాత తెగలనుండియే గైకొనబడెను. కావున ఆ తెగలవారు, యించుక బడలికచెంది పురుష సంఖ్య చాలక, క్రొత్త యువకులను కావలసినంత మందిని పంపుటలేదు.

భారతీయ సైన్యంలో తరగతి విభజనలు పరిపాలనా సౌకర్యములు సాంఘిక ఆచారములనుబట్టి అంగీకరించబడి అమలునందున్న వేగాని, కొందరు చెప్పునట్లు ప్రత్యేకాభిమానాలాను పెంచుట కుద్దేశింపబడినవి కావు. వేరు వేరు తెగలవారికి వేరు వేరు రకముల తినుబండారములు ఆయా సంఘముల, ప్రాంతీయాచారములనుబట్టి యివ్వవలసి వచ్చుచుండును.

ప్రత్యేక రకము ఆయుధముల నుపయోగించుటకు తగినంతమందిని సంపాదించుట కష్టంగానే యుంది. కాని లోటు యిదివరకంత యెక్కువగలేక తగ్గిపోయింది.

---

# ఇండియాలో రాయలు విమానాల ఘన కార్యం.

## కాందిశీకులకు 46 దినాలలో 6,0000 పౌనుల ఆహారం పడ వేయుట.

రాయలు విమానదళంవారు గత 46 దినములలో 600,000 పౌనుల ఆహార పదార్థములను, వైద్య చికిత్స పరికరములను, బర్మానుండి ఇండియాకు వచ్చుచున్న కాందిశీకులకు పైనుండి పడవేసిరి; అని న్యూ ఢిల్లీ విమానా శాఖాధికారులు ప్రకటించిరి.

ఈ ఆహార పదార్థములను పడవేయుటే కాక, అనేక వందలమంది కాందిశీకులను విమానాలపై ఇండియాకు తెచ్చిరి. పలుసారులు వైమానికులు తమ విమానములను అడవి ప్రదేశములందు దింపవలసివచ్చెను. వారి ఘన కార్యములను కాందిశీకులు కృతజ్ఞతతో కొనియాడిరి.

ఇటీవలనే బర్మానుండి వచ్చిన భారతీయ సైన్యపు ఉన్నతోద్యోగి యొకడు, రాయలు విమానదళం వారి పనిగూర్చి యిట్లు విమర్శించెను; "ఈ వైమానికులు చాల దయా పూర్వకమయిన ఘనకార్యము చేసిరి. వారెపుడు గురి తప్పలేదు. కాందిశీకులు నడచుచుండగ తమ ప్రక్కనే ఆహార పదార్థములు పడుటగాంచి కృతజ్ఞత దెల్పుటచూడ ఆహ్లాదకరముగా నుండెను."

ఈ మానవ సేవా కార్యములు జరుగుచుండగ, యితర వైమానికులు బర్మాలో శత్రువాక్రమించిన ప్రాంతాలపై బాంబులు వేస్తూనేయున్నవి. అంతేకాక, నౌకలకు విమానాలు కాపలా కాయుచుండెను, ముఖ్యమగు ప్రాంతాలకుపోయి వేగు చూచి వచ్చుచుండెను.

విమానాలు ఒకే రోజున 60,000 పౌనుల బరువుగల ఆహార పదార్థములను మోసినవి. వందలకొలది కాందిశీకులు తిండిలేక మాడుచున్న

తావులందు యీ పదార్థము పడవేయబడెను. బర్మాలో ఎక్కువ భాగమునందు, అస్సాములో కొన్ని ప్రాంతములందు యీ విమానాలు యీరీతిగ సహాయంచేసినవి. అనేకసారులు వైమానికులు తుపానుగాలి నెదుర్కొని ఎగురవలసి వచ్చెను.

"మంచికిపోతే చెడుగువచ్చింద" న్నట్లు, యీ ఔదార్య కార్యమునందు ఇండియాలోని రాయలు వైమానికులకు కొంత హానికూడ కలిగెను. అయినను యీ కార్యములు కాందిశీకులకు అవసరమగు చోట్ల నెల్ల యికముందుగూడ జరుగుచునే యుండును.



బ్రిటిషు క్రూయిజరు టాంకులు. శత్రు భీకరమగు యీ మహా యంత్రములు ఆఫ్రికాయందు కాపలా కాయుచున్నవి.

# నాజీ ఫల రసాయనం.

చాలామందికి, ముఖ్యంగా సామాన్య జనానికి, యుద్ధం అంటే, ఒక పెద్ద కుస్తీ మాదిరిగా కన్పిస్తూ ఉంటుంది. ఈ కుస్తీలో ఎవడు బాగా గెలుస్తూ ఉంటాడో వాడే గొప్ప వస్తాదనిన్నీ, అటువంటి గొప్ప వస్తాదు తప్పకుండా గౌరవింపదగినవాడే అనిన్నీ ప్రజలలో ఒక విధమైన అభిప్రాయధోరణి ఉన్నది. కాని యుద్ధానికీ, కుస్తీకి చాలా భేదం ఉన్నది. అన్నింటికన్నా ముఖ్యమైన పెద్ద భేదం ఏమిటంటే, కుస్తీలో మనుష్యులను చంపరు. యుద్ధంలో మనుష్యులను చంపుతారు. కుస్తీ అనేది శరీర సాధకంకోసం చేసేటటువంటిది. యుద్ధం అనేది రాజ్యాలు అపహరించడంకోసం చేసేటటువంటిది. కాబట్టి యుద్ధం ఒకవిధమైన పెద్ద ఖూనీ, పెద్ద చోరీ వంటిది. ఇటువంటి యుద్ధములకు కత్తికట్టి, అక్రమంగా నిష్కారణంగా యితరులమీదకు తన సేనలతో దండెత్తివచ్చినటువంటివాడు, దొంగల నాయకుడుగాక మరెవ్వరు ? హంతకుల నాయకుడుగాక మరెవ్వరు ? ఒక ఘోర హంతకుడు తన బందిపోటుముఠాతో వచ్చి, మన యింట్లో చొరబడినప్పుడు, మన యింట్లో ఉన్నవాళ్లను తుపాకులతో కాల్చివేస్తానని బెదరించి, కత్తులతో పొడిచివేస్తానని భయపెట్టి, తన మాటకు ఎదురు జవాబు చెప్పిన వాళ్లను చంపివేసి, మన యింట్లో ఉన్న వెండి బంగారములను దోచుకొని తీసికొని పోయినప్పుడు, మనము చేతనైతే ఎదిరించవలెననే ఆగ్రహావేశంతో ఉంటాము. ఇరుగుపొరుగు వాళ్లు చూచి ఊరుకోగలరా ? గ్రామస్థులందరూ ఏకమై, చేతి కందిన ఆయుధ సాధనములతో వచ్చి, ఆ బందిపోటుదొంగల ముఠాను ఎదిరించి, అడ్డగించి, హతము చేయవలెనని ప్రయత్నిస్తారు కాని యీ పోరాటంలో ఆ బందిపోటు దొంగలే ఎక్కువ సమర్థులై, మనకు సహాయము వచ్చిన వాళ్ల నందరినీ చావగొట్టి జయిస్తారనుకోండి. అప్పుడు ఆ దొంగల ముఠాయొక్క శౌర్య

ప్రతాపములను చూచి మనము ఆనందించ గలమా? ఆ దొంగల అక్రమ పరాక్రమమును కొనియాడగలమా? అందాకా ఎందుకు? మన యింట్లో కాకుండా, మన యిరుగుపొరుగువాళ్ల ఇంట్లోనికే బందిపోటు దొంగలువచ్చి దోచుకొను చున్నారనుకోండి. ఆ యింటిలోనివాళ్లు ఎంత బలశాలులైనప్పటికీ, ఎంత బాగా ఎదిరించి పోరా డినప్పటికి, ఆఖరుకు ఆ దొంగల మురాయొక్క ఆయుధ బలానికి ఆగలేకపోయినారనుకోండి. అటువంటి సందర్భంలో, ఆ చోర నాయకుని శౌర్యము చాలా గొప్పదని మెచ్చుకోగలమా? ఆరీతిగా మనము ఎన్నటికీ మెచ్చుకొనలేము. కారణమేమిటి? ఆ చోర నాయకుని తెలివి తేటలు లోకాన్ని పీడించుటకోసం వినియోగి స్తున్నాడు. తనవంటివాళ్లే యితరులుకూడా అనే భావం అతనికి కించిత్తుకూడా లేదు. ఒకరి నింకొకరు చేతనైతే దోచుకొని తినడమే ఉత్త మమైన బ్రతుకుతెరవు అని ఆ దొంగల నాయ కుడు నమ్మి ఆ ప్రకారంగా బందిపోట్లు చేస్తు న్నాడు. తనతో కలిసి యీ బందిపోట్లు చేసిన వారికి, అనగా తన మురాలో చేరినవారికి, తనకు తోచిన భాగం, ఆ దొంగ సొత్తులో పంచిపెట్టు తానని ఆశ పెట్టుతున్నాడు. ఈవిధంగా తన చోరీలకు, తన ఖూనీలకు చేయూతగా పనిచెయ్య గలవారిని తన మురాలో చేర్చుకుంటున్నాడు. తన మాటకు ఎదురు జవాబు చెప్పితే, తన మురాలోని వాళ్లనుకూడా చంపివేస్తాడు. ఇటు వంటి చోరనాయకుడు సంపాదించిన ఐశ్వర్యం యావత్తూ కాపాడుకొనుటకున్నూ దానిని స్థిరంగా ఉంచుకొని భద్రపరచుకొని అనుభవించుటకొర కున్నూ, కొంత సిబ్బందీ సమృద్ధిగా ఉండాలి. కాని, యీ మురాలో చేరిన వాళ్లందరూ నేర్చిన విద్య ఒక్కటే. ఒకరి నింకొకరు చేతనైనంత వరకూ, సమర్థత ఉన్నంతవరకూ దోచుకొని చంపుకొని తినడమే. ఈ విద్యనే ఆ మురా నాయకుడు తన మురాకు బాగా నేర్పినాడు. అటువంటి విద్య నేర్చిన యీ చోర సంఘంలోని వారు తమలో తాముకూడా యీ ప్రకారంగానే దోచుకొని, కొట్టుకొని, చంపుకొని, దొంగిలించిన ఐశ్వర్యానికి అధిపతులు కావలెనని ప్రయ త్నిస్తారు. చోరీ ఆస్తిలో భాగాలు పంచుకొన డంలో ఒకరికంటె ఇంకొకరు దురాశాపరులై వారిలో వారే తిరిగి దోచుకోవలసివస్తుంది. వారు నేర్చిన విద్యను వారిలో వారే వర్తింపజేసుకొని, తమ దుర్వృత్తివల్ల తామే నశిస్తారు. ఈ పద్ధతి కొనసాగేది కాదు. ఇది శాశ్వతముగా నిలిచే లక్ష్మి కాదు. ఇటువంటి పద్ధతిని ప్రపంచం చిరకాలం అనుసరింపజాలదు. ఇది లోకవినాశ హేతువే గాని, లోక శాంతికి హేతువు కాదు.

హిట్లరు ప్రారంభించిన నాజీ తత్వం ఇటు వంటిదే. ఇతర రాజ్యాలను అక్రమంగా ఆక్ర మించుకోవలెననే రాక్షస సంకల్పం హిట్లరుకు కలిగింది. అందుకొరకై కావలసిన ఆయుధ సామగ్రులను విశేషంగా సమకూర్చుకొన్నాడు. తన సంకల్పమును జర్మనీలోని ప్రజలందరూ ఆమోదించవలెనన్నాడు. ఇతర రాజ్యాల నన్నిం టినీ దోచుకొని తినడమే జర్మనీయొక్క కర్త వ్యమని బోధించాడు. లేకపోతే ఇక జర్మనీ వృద్ధిలోకి రాదన్నాడు. లేకపోతే ఇక జర్మనీ తలయెత్తుకొని యీ ప్రపంచంలో తిరుగజాల దన్నాడు. ఈ సంకల్పం సాధించడానికి, ఇతర రాజ్యాలమీదకు బందిపోట్లుసాగించడానికి, జర్మనీ పూనుకొనవలెనన్నాడు. ఈ తత్వం ఆమో దించినవాళ్ల నందరినీ నాజీ జర్మనులను పేరుపెట్టి నామకరణం చేసాడు. ఈ నాజీ పార్టీ ప్రతిజ్ఞకు ప్రతికూలంగా జర్మనీలో ఎవరైనా ప్రవర్తిస్తూ వుంటే, అటువంటివాళ్ల నందరినీ రూపుమాపి తన నాజీ తత్వమునే ప్రబలం చేసాడు. తన నాజీ తత్వాన్ని జర్మనులందరూ శిరసావహిస్తే, జర్మ నీకి గొప్ప ఫలితం ఉన్నదన్నాడు. జర్మనీకి అఖండ సామ్రాజ్యం లభిస్తుందని బోధించాడు.

కాని, ప్రపంచంలోని రాజ్యాల నన్నింటినీ, తాను ఒక్కడే తన జర్మను నాజీ సైన్యంతో జయించగలడా? తన రాజ్యం చిన్నది. తాను జయించదలచిన రాజ్యాలు పెద్దవి. బ్రహ్మాండ మైనవిగా ఉన్నాయి. అందువల్ల తన చోరీ దండయాత్రలో తనతో భాగస్వాములుగా చేర దలచిన మరికొన్ని రాజ్యాలను చేర్చుకొన్నాడు. వీటినే అక్షరాజ్యాలన్నాడు. ఇటలీ రాజ్యం హిట్లరుయొక్క మురాలో చేరింది. జపాను కూడా అక్షరాజ్యాల మురాలో చేరింది. మరి కొన్ని చిన్న రాజ్యాలనుగూడా చావగొట్టి, తన యిరుగుపొరుగున ఉన్న రుమేనియా, హంగరీ రాజ్యాలను నిర్బంధ విధిగా తన మురాలో చేర్పిం చాడు. ఈ అక్షరాజ్యాల మురాను తనకు అండగా ఏర్పరచుకొన్న తర్వాత ప్రపంచంలోని

పెద్ద రాజ్యాలను దోచుకొనుటకు ఆటంకము ఏమీ లేదని హిట్లరు తీర్మానించాడు. ప్రపంచములోకెల్ల పెద్ద స్వతంత్ర రాజ్యమైన రష్యాను ముందుగా జయించవలెనని సంకల్పించాడు. కాని, రష్యాతో యుద్ధం చెయ్యడానికి జపాను పూనుకోలేదు. రష్యాతో యుద్ధం చెయ్యనని జపాను తటస్థంగానే దూరంగానే కూర్చున్నది, రష్యాయుద్ధంలో జర్మను సేనలు వేలకొలదిగా లక్షలకొలదిగా నాశనమౌతూ ఉంటే, నిశ్చలంగా చూస్తూ జపాను జపం చేస్తోంది. డాన్ నది వద్ద రష్యాలో ఘోర యుద్ధం జరుగుతోంది. ఆ నది రక్తపు వరదలై ప్రవహించుచున్నదని వార్తలు వస్తున్నాయి. కాని జపాను, ఇదంతా వినోదంగా చూస్తోంది. జపానువాళ్లు చెప్పే మాటలు ఎట్లా ఉన్నాయో చూడండి. " తెల్ల జాతివాళ్లు ఆసియా ఖండంలో ఉండకూడదు. ఆసియా ఖండం ఆసియా ఖండవాసులదే " అంటున్నది రష్యా రాజ్యం అటు అయిరోపా ఖండంలోనుంచి ఆసియా ఖండంలోకి బ్రహ్మాండంగా విస్తరించి ఉంది. తెల్లవాళ్లమీద జపానుకు ద్వేషం ఉంటే జర్మనీతో ఇటలీతో జపాను ఏకమై అక్షరాజ్యాల ముఠాలో జపాను ఎట్లా చేరింది ? నాజీ తత్త్వం జపానుకూడా శిరసా వహిస్తూ ఉంటే, జర్మనులు తెల్ల యూరోపియను జాతివాళ్లయి ఉంటే, తెల్ల జాతివాళ్లను జపాను వాళ్లు ద్వేషించడం ఎందుచేత ? ఇదే హిట్లరు యొక్క అక్షరాజ్యాల ముఠాలో ఉన్న గొప్ప అసందర్భం. ఈ దొంగల ముఠాలోనే అంతరంగ విద్వేషం ఉండక తప్పదు. నాజీ తత్త్వం యొక్క ఫలితం ఇది. ఈ నాజీ తత్త్వ ఫలితము యొక్క అనుభవం హిట్లరు ఇంకా ముమ్మందు అనుభవిస్తాడు. ఈ నాజీ ఫల రసాయనం ఇంతవరకు చాలావరకు గుణమిచ్చినదని జర్మనులు భ్రమిస్తున్నారు. కాని, యీ నాజీ ఫల రసాయనం లోకాన్ని ఇంకా సంక్షోభింపజేసి, ఆఖరుకు ఈ నాజీఫల వృక్షమయిన జర్మనీని కూడా నాశనం చేస్తుంది. ఈ జర్మను నాజీ తత్త్వ ఫలమే చేదు విషమై హిట్లరుకుకూడా భరింపరానిదై అతనిని కూడా సంహరిస్తుంది.

---

# టొబ్రూకు యుద్ధం - భారతీయ సైనిక సాహసం.

టొబ్రూకువద్ద జరిగిన యుద్ధమును స్వయముగా చూచివచ్చిన భారతీయ సైనిక ప్రేక్షకు డొకడిట్లు వర్ణించి చెప్పెను :—

టొబ్రూకు చుట్టునుగల దుర్గమ ప్రాకారములను శత్రువు చుట్టుముట్టిలోనికి చొరబడిన క్రిందటి దినమువరకు నేను టొబ్రూకులోనే యుండి వచ్చితిని. శత్రువు టొబ్రూకునకు పడమటను, దక్షిణమునను, తూర్పునను ఆవరించెను. టొబ్రూకునుండి బార్డియాకు పోవు రస్తా ఇంకను అప్పటికి శత్రువుచే భేదింపబడి యుండలేదు. జనరలు రోమెలుగారి జర్మను సేన ఎల్‌ఏడెంవైపుకు పోవుచున్నట్లుగా కన్పించెను. అప్పుడు బ్రిటిష్ సైన్యము టొబ్రూకునకు నైరృతిగా స్థావరమేర్పరచుకొనియుండెను. ఎడమ చేతివైపున ఘూర్కా పటాలములుండెను. మధ్యలో మరాటా పటాలములుండెను. ఇంగ్లీషు పటాలములు కుడివైపున ఉండెను. ఫిరంగి దళములుకూడా యీ పటాలములకు అండగానుండెను. అప్పుడు ఆ సందర్భంలో యీ బ్రిటిష్ పటాలములు తప్పించుకొని పోవుటకు టొబ్రూకునుండి బార్డియాకు పోవు మార్గమొక్కటే అవకాశముగా నుండెను. జూను నెల 20 వ తేదీని జర్మను మోటారు సైన్యములు టొబ్రూకు - బార్డియా రోడ్డును భేదించి ఆ రోడ్డుకు అడ్డముగావచ్చి నిలచెను. వెంటనే రెండు గంటలు గడచిన తోడనే జర్మనులు ఫిరంగులు బారుచేసి కాల్చుట సాగించిరి. మహారాష్ట్రి పటాలములు నిలువబడియున్న ప్రదేశమే కొంచెము బలహీనముగా, తక్కువ బందోబస్తుగానుండెను. ఈ ప్రాంతం మీదనే మధ్యాహ్నం 2 గంటలవేళ జర్మనులు అతిభీకరముగా ఫిరంగులను కాల్చుటకు ప్రారంభించిరి. ఆ సమయంలోనే జర్మను విమానములు చాలా క్రిందుగా ఎగురుచూవచ్చి మందుగనులు మాటుపెట్టబడిన ఒక సన్నని త్రోవపై బాంబులువేయ నారంభించెను. అచటి మందుగనులు ప్రేలినపిమ్మట ఏర్పడిన కందకముగుండా జర్మనుల అగ్రసేనలు ముందుకు చొచ్చుకొని వచ్చెను. వారి వెన్వెంటనే టాంకులు వచ్చు

చుండెను. ఆ టాంకుల వెన్వెంట ఇటాలియను కాల్బలము వచ్చుచుండెను. ముందంజవేయు చున్న జర్మను అగ్రసేనలు పొగ జుంజురులను ముందుకు విసరివేయుచు పెద్ద ధూమా వరణ మును కల్పించుచుండెను. ఆ ధూమావరణలో వెనుకనుంచి వచ్చుచుండిన టాంకులు కన్పించుట లేదు. కాని, మరాటా సైన్యము ఒక అరగంట సేపు శత్రుసేనను ఎదిరించి కదలనివ్వకుండా చేసెను. కాని, పైనుండి జర్మను విమానాలు నిరంతరంగా బాంబులు వేయుటవల్లను, ముందుకు సాగివచ్చుచున్న జర్మను టాంకులు అగ్నివర్షము కురిపించుచుండుటవల్లను, జర్మను టాంకుదళ ములు ముందుకు రాగల్గెను. మరాటా సైన్యములు ఇంకను శత్రువుల దాడికి ఎదురొడ్డుచునే యుండె ను. కాని చిట్టచివరకు శత్రువుకు లొంగవలసి వచ్చెను. ఈ లోపుగా శత్రు సైన్యములు మరింత ముందుకు చొచ్చుకొని వచ్చెను. ఘూర్కా సేనలును, ఇంగ్లీషు సోల్జరులును శత్రు వును ఎదిరించవలసివచ్చెను. జర్మను టాంకులు బ్రిటిష్ ఫిరంగులు ఉన్నటువంటి స్థావరముల మీదకువచ్చి ఒక్కటొక్కటిగా ఆ ఫిరంగులను కాల్చుటకు వీలులేకుండా బంధించెను.

ఇది ఇట్లుండగా మరాటా పటాలముల కర్న లు తన పటాలమునకు తోడ్పాటుగా ఒక బ్రిటిష్ టాంకు దళమును పంపవలసినదని సందేశము పంపెను. కాని, ఆ టాంకుదళము వచ్చేసరికి కాలాతీతమైనది. ఆ టాంకుదళము వచ్చేసరికి, జర్మనులు టాంకు ప్రతిఘటన ఫిరంగులను మూడింతలుగా సిద్ధపరచి ఆయువుపట్టుగానున్న ప్రతిచోటను బిగించి కాల్చుచుండిరి. అందువల్ల మన బ్రిటిష్ టాంకులు మొదటి రకపు టాంకులే అయినప్పటికీ, యీ టాంకు ప్రతిఘటన ఫిరంగు లకు గురియై బలియయ్యెను.

జర్మను టాంకులు విజృంభించి ముందుకు విస్తరించుచున్న సమయంలో ఇక లాభము లేదని ఎంచి 11 వ బ్రిగేడు పటాలపు సైనికాధి కారి తన సైనికులను తమవద్దనున్న కాగితము లను యావత్తు కాల్చివేయవలెనని ఉత్తరువు చేసెను. టొబ్రూకునకు దక్షిణంగాఉన్న సము ద్రతీరమునకు పోవలసినదిగా ఉత్తరువుచేసెను.

ఈలోపుగా ఘూర్కాలు ఇంగ్లీషు సోల్జర్లు తీవ్రంగా పోరాడుచుండిరి. అప్పుడు ఆ పటాల ములు చిన్న జట్లుగా విడిపోయి పోరాడుచుండెను. దక్షిణాఫ్రికా పటాలములను సహాయార్థంగా తీసి కొనివచ్చే నిమిత్తమై ఆ పటాలాధికారియున్నూ మరొక ఆఫీసరున్నూ, ఒక మోటారు లారీలో ఎక్కి వెళ్లిరి. కాని వారు తిరిగి కన్పించలేదు.

అప్పటికి జర్మను ఫిరంగుల కాల్పులు అంత కంతకు ఎక్కువయ్యెను. జర్మను విమానముల బాంబు ప్రయోగములుకూడా ఎక్కువయ్యెను.

టొబ్రూకు రేవులో బ్రిటిష్ నావలు కొన్ని ధూమావరణం కల్పించుకొని యుండెను. కాని, శత్రువుల విమానాలు విధి విరామంలేకుండా ఆ నావలపై దాడి సాగించుచుండెను. టొబ్రూకు పడమటి వైపునుంచికూడా జర్మనులు ఫిరంగు లతో ఓడరేవుపై కాల్చుచుండిరి.

అటువంటి సందర్భంలో భారతీయ సైనికులు శత్రువుల బారినుండి తప్పించుకొని పోవుట కేవ లము అసాధ్యముగా నుండెను. అట్లయినప్ప టికీ, భారతీయ సైనికులు సముద్రతీరమునకు చేరిరి. బ్రిటిష్ టార్పెడో పడవలు వారిని ఎక్కించుకొనెను. ఆ పడవలలో వారు ఎక్కిన వెంటనే, రెండు బాంబు దెబ్బలు పైనుండి తగి లెను. ఆ టార్పెడో పడవలు పొగ ఆవరణ మూలంగా ఆ పొగ మరుగున తప్పించుకొని పోయెను. అంతవర కింకను ఘూర్కా సైని కులు, ఇంగ్లీషు సోల్జర్లు శత్రువు నెదిరించి పోరా డుచునే యుండిరి. కాని, కొలది గంటలు గడ చిన పిమ్మట, వారిలో 200 మంది చినిగిన గుడ్డ లతో నానా భీభత్సదశలో సముద్రతీరమునకు వచ్చి ఆ నావకై ఎదురుచూచుచుండిరి. ఆ నావవచ్చి వారిని ఎక్కించుకొని సజీవంగా వారిని తీసికొని రాగల్గెను.

# మద్రాసు పటాలముల జనహాని.

మదరాసు పటాలములో యీ దిగువ జనహాని కలిగిందని తెలుపుటకు విచారించుచున్నాము :—

## వైస్రాయి కమిషను ఉద్యోగులు.

చనిపోయినవారు.

| నెంబరు. | హోదా. | పేరు. |
|---|---|---|
| ఇండియన్ ఫిరంగి దళం— | | |
| | జమేదారు .. | లక్ష్మణను. |

## ఇతర హోదాలు.

చనిపోయినవారు.

| | | |
|---|---|---|
| 101372 | పి ఎల్. నాయక్. | కె. పి. అమ్మనను. |
| 100088 | డ్రైవరు . | అనంజ పెరుమాళు పిళ్లై. |
| 1-932 | యు ఎల్. నాయక్. | దివాను శింగు. |
| 101424 | సిగ్నలరు . | గణపతి నాయుడు. |
| 100846 | ఎ నాయక్. | జగన్నాథను. |
| 100063 | గన్నరు . | కె. జాను. |
| 101293 | క సిగ్నలరు. | కన్నయ్య |
| 102505 | గన్నరు .. | క్రిష్ణ కురుప్ |
| 34298 | హవల్దార్ . | మనాను ఖాను |
| 101295 | క. సిగ్నలరు | మహమ్మను నజీరుద్దీన్. |
| 101428 | గన్నరు .... | ఎన్. ముత్తు పిళ్లై. |
| ఎ-3 | వంట .. | పార్థసారధి ముదల్యారు. |
| 101242 | యు. పి. ఎల్. నాయకు. | రాజగోపాలు. |
| ఎ.ఎ ఎ 4474 | గన్నరు | సాహెబు దిను. |
| 102499 | క. సిగ్నలరు. | సౌందర పాండ్యను. |
| 101312 | గన్నరు | షాకునుద్దీను సాహెబు. |
| 101427 | లా. నాయకు. | కె సిద్దియను. |
| 100259 | లా హవల్దారు. | వీరస్వామి. |
| ఇండియను హాస్పటలు కోరు— | | |
| 87563 | ఎ. సిపాయి. | గంగరాజు. |
| 82-28 | ఎ. సిపాయి. | సిన్నస్వామి. |

గాయాలతో చనిపోయినవారు.

1 సోమ. ఎల్. వి. స్వీపరు .. రాజు

యద్ధ ఖైదీలుగా మరణించినవారు.

మదరాసు సాపర్లు, మైనర్లు—

| | | |
|---|---|---|
| 17747 | సాపరు .. | శాతావి. |

| నెంబరు. | హోదా. | పేరు. |
|---|---|---|

గాయపడినవారు.

| | | |
|---|---|---|
| ఇండియను ఫిరంగిదళం— | | |
| 104317 | డ్రైవరు ... | పి ఎన్. మూర్తి. |
| 101401 | ఎ నాయకు. | నల్లయ్య గౌండరు. |
| 101531 | గన్నరు .. | పంతురామను. |
| 101356 | డ్రైవరు ... | డి రాములు. |

కనబడక, యుద్ధ ఖైదీలుగనున్నట్లు ఎంచబడినవారు.

| | | |
|---|---|---|
| 101433 | డ్రైవరు ... | అనయముత్తు చెట్టి. |
| 102856 | గన్నరు ... | అప్పయ్య పటేల్. |
| 100065 | యు పి లా నాయకు. | అప్పయ్య |
| ఎఫ్ 513 | వంట ... | చిన్నస్వామి. |
| 101285 | ఆ. నాయకు | గోవిందస్వామి. |
| 102594 | డ్రైవరు .. | ఎస్. కొండయ్య. |
| 101512 | యు.పి ఎల్. నాయకు. | కృష్ణస్వామి. |
| 103016 | గన్నరు ... | జి. ఎస్ కృష్ణస్వామి నాయుడు. |
| 100078 | గన్నరు .. | కృష్ణస్వామి నాయుడు. |
| 101423 | గన్నరు .. | పి. నారాయణ పిళ్లై. |
| ఎఫ్ 506 | వంట ... | నరశింహ నాయుడు |
| 101237 | గన్నరు .. | నటేశను. |
| 101369 | డ్రైవరు ... | పరమానందను. |
| ఎఫ్ 507 | వంట .. | పెరుమాళుస్వామి. |
| ఎఫ్ 512 | ... | రామను నాయుడు. |
| 102490 | గన్నరు ... | సభాపతి. |
| 102496 | గన్నరు ... | సాంబశివం. |
| ఎఫ్. 515 | వంట నౌఖరు. | సుబ్రహ్మణ్య పిళ్లై. |
| 101370 | నాయకు . | ఐ స్వామి. |
| 100087 | గన్నరు ... | వీరస్వామి. |
| ఎఫ్. 511 | ... | వేలాయుధం. |
| 101310 | యు పి.ఎల్. నాయకు. | వెంకటచలం. |
| ఎఫ్. 512 | స్వీపరు ... | వెంకటస్వామి. |
| 102793 | గన్నరు ... | వేణుగోపాల్. |

ఇదివరలో కన్పించనివారి జాబితాలో నుండెను. అతడు యుద్ధ ఖైదీగా నుండవచ్చునని యూహించబడెను. ఇప్పుడు నిజమని ఖాయపరచబడెను.

| | | |
|---|---|---|
| 16375 | సాపరు ... | ఆంతోని ముత్తు. |
| 16215 | హవల్దారు ... | ఆరోగ్యసామి. |
| 18316 | సాపరు .. | ఆరోగ్యసామి. |
| 18150 | సాపరు ... | బాచ్చా. |
| 18586 | సాపరు ... | చిన్నప్పన్. |

| నెంబరు. | హోదా. | | పేరు. |
|---|---|---|---|
| 18529 | సాపరు | ... | డానియల్, ఆర్. |
| 1000 | సాపరు | ... | ఎల్లిగాడు. |
| 13900 | సాపరు | ... | గణేష్, వి.యస్. |
| 18012 | సాపరు | ... | జ్ఞాన ప్రకాశం. |
| 17310 | నాయక్ | ... | గోవిందరాజ్. |
| 14048 | సాపరు | . | హెన్రీ |
| 18523 | సాపరు | | కృష్ణ పిళ్లె. |
| 13552 | సాపరు | ... | మాణిక్యం. |
| 16050 | సాపరు | ... | మునిస్వామి. |
| 18369 | సాపరు | ... | పొన్నుసామి. |
| 14741 | సాపరు | .. | రాజు. |
| 17144 | సాపరు | .. | తంగవేలు. |

ఇండియన్ సిగ్నలర్సు దళము,

| | | | |
|---|---|---|---|
| 9351 | సిగ్నలరు | . | అబ్దుల్ అజీజు. |
| ఎ/3850 | సిగ్నలరు | .. | అబ్దుల్ హఫీజు. |
| ఎ/1430 | సిగ్నలరు | ... | అబ్దుల్ హఫీజు ఖాన్. |
| ఓ/2071 | డబ్ల్యు/సి ఆర్ | | ఆదిమూలం. |
| ఒ/9726 | సిగ్నలరు | ... | గోపాలస్వామి. |
| ఒ/5580 | వంటవాడు | ... | గోవిందన్. |
| 8203 | సిగ్నలరు | .. | మహమ్మదు ఇనామత్. |

| నెంబరు. | హోదా. | | పేరు. |
|---|---|---|---|
| ఎ/2918 | సిగ్నలరు | ... | మహమ్మదు షరీఫ్. |
| ఒ/2412 | స్వీపరు | . | పూసిన్. |

రాయల్ ఇండియన్ సిగ్నలర్సు పటాలము.

| | | | |
|---|---|---|---|
| ఎం.టి/891332 | సిపాయి | . | ఎల్ మాముడి స్వామి. |
| ఎం.టి/899552 | సిపాయి | .. | కే సోమసుందరం |

ఐ హెచ్ సి.—

| | | | |
|---|---|---|---|
| 93330 | ఏ సిపాయి | . | గోపాల్, కె. ఎ. |
| హెచ్/186256 | 2/జి/స్వీపరు | .. | మునియప్ప. |
| హెచ్/185250 | ధోబీ | .. | పలాండి కందప్ప. |

ఐ ఎ.ఒ సి.—

| | | | |
|---|---|---|---|
| ఒ/31971 | ఫిట్టరు | .. | బాబు నాయుడు. |
| ఒ/31140 | ఎలెక్ట్రిషియన్, | | శ్రీరాం. |

అదివరకు తప్పిపోయి తిరిగి చేరినవారు.

ఆర్ ఐ ఎ ఎస్.సి.—

| | | | |
|---|---|---|---|
| ఎంటి/928940 | సిపాయి | ... | వై. నరసింహులు |
| ఎంటి/894032 | సిపాయి | .. | ఆర్. సుబ్బయ్య. |

మదరాసు సాపర్లు, మైనర్లు—

| | | | |
|---|---|---|---|
| 63647 | సాపరు | | అయ్యం పిళ్లె. |